# గుర్వష్టకము–9

## శ్రీ శంకరాచార్యులవారు

**అనర్ఘ్యాణి రత్నాని భుక్తాని సమ్యక్**
**సమాలింగితా కామినీ యామినీషు**
**గురోరంఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం**
**తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిమ్.**

తా॥ అమూల్యములగు రత్నములను చేజిక్కించుకొని వానిని లెస్సగ అనుభవించినప్పటికిని, రాత్రులందు కాంతా సమాలింగన సుఖమును బడసినప్పటికిని గురుదేవుని పాదపద్మములందు మనస్సు లగ్నము కానిచో ఏమి ప్రయోజనము?

వ్యాఖ్య :- ప్రాపంచిక సంపదలు, విషయభోగములు శరీర మున్నంతవఱకే ఉండును. అవి శాశ్వతములు కావు. పైగా ఆ సుఖములు దుఃఖమిశ్రితములై యుండును. కావున అవి ఎన్ని యున్నప్పటికిని గురుపాదముల యెడల భక్తిలేనిచో, దైవమును ఆశ్రయించనిచో అవియన్నియు నిరుపయోగ ములే యగును. కాబట్టి వివేకవంతుడు సారా సారములను లెస్సగ వివేచించి నిరతిశయానంద మును, సంసార బంధవిముక్తిని కలుగజేయు గురు, దైవ సేవనమునే ఆశ్రయించవలెను. అట్టి భక్తి లేనిచో ప్రాపంచిక భోగజాలమువలన ఇసుమంత యును ప్రయోజనము లేదు.

ఓం




సంపుటము : 24 మార్చి 1992 సంచిక 3

## సంపాదకవర్గము



సంవత్సర చందా : రూ. 30/-లు

పంపవలసిన అడ్రసు : మేనేజరు, వేదాంతభేరి కార్యాలయము
అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట
పి.బి.నెం.323, విజయవాడ-520 002
ఫోన్స్ : 61862, 64017 Telex : 0475 362 ANIL

శాశ్వత చందా : రూ. 300/-లు.

పంపవలసిన అడ్రసు : 'వేదాంతభేరి శాశ్వతనిధి'
శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీ శుకబ్రహ్మాశ్రమము
పోస్టు, శ్రీకాళహస్తి-517 640
ఫోన్ నెం. 239 STD Code 085 78

**చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరములలో తమ చందా నంబరు తప్పక ఉదహరించవలెను. చందా నంబరు మీకు పోస్టులో వచ్చు 'వేదాంతభేరి' కవరుపై యుండును.**

# [illegible]

అనుష్ఠాన వేదాంతమును బోధించు ఆధ్యాత్మిక మాసపత్రిక

**BE FEARLESS : నిర్భయులై యుండుడు!**

## విషయసూచిక



**: ముఖచిత్రము :**

సేతుబంధన సమయాన శ్రీరామ, లక్ష్మణ, హనుమదాదుల
పూజలందుకున్న జ్యోతిర్లింగస్వరూపా!
శ్రీ రామలింగేశ్వరస్వామీ! సాంబ సదాశివా!
సదా నీకు ప్రణామములు.

## ప్రార్థన



## హనుమత్ప్రార్థన

ధ్యాయేద్బాల దివాకరద్యుతినిభం దేవారి దర్పాపహం
దేవేంద్ర ప్రముఖ ప్రశస్త విభవం దేదీప్యమానం రుచా।
సుగ్రీవాది సమస్త వానరయుతం సువ్యక్త తత్త్వప్రియం
సంయుక్తాయుత లోచనం పవనజం పీతాంబరాలంకృతమ్॥

బాలసూర్యునివంటి ప్రకాశము కలవారును, రాక్షసుల దర్పమును అడంచినవారును, దేవేంద్రాది ప్రముఖులచే ప్రశంసింపబడిన వైభవము కలవారును, దేదీప్యమానమగు కాంతితో గూడినవారును, సుగ్రీవాది సమస్త వానరసహితులును, తత్త్వజ్ఞాన సంయుక్తులును, వాయుపుత్రులును, పీతవస్త్రాలంకృతులును అగు హనుమంతుని ధ్యానించుచున్నాను.

(26.5.1992–హనుమజ్జయంతి)






I teach only the self, hidden in the heart of every individual, and common to all. A handful of strong men knowing that self and living in its light would revolutionise the world.

ప్రతి ప్రాణియొక్క హృదయమందు దాగియుండునదియు, అందఱియందును, సమానముగ వెలయుచుండునదియు అగు ఆత్మను గూర్చియే నేను బోధించుదును. అట్టి ఆత్మను తెలిసికొనువారును, అట్టి ఆత్మ ప్రకాశమందు స్థితి గలిగియుండువారునగు కొద్దిమంది అయినను ప్రపంచమునంతను తేజోవంతముగ నొనర్పగలరు.

OO

# సర్వసాక్షి

శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు



ఎచటనైన రాత్రిపూట నాటకము జరుగునపుడు రంగస్థలము, పాత్రధారులు, నాటకమును దర్శించువారు, నాటక భవనమున గల కుర్చీలు, బెంచీలు మొదలైన సామగ్రి- ఇవియన్నియు నుండును. కాని రంగస్థలమందు వెలుగుచుండు దీపము వీనియన్నిటిని ప్రకాశింపజేయుచు తానున్ను ప్రకాశించుచూనుండును. దీపమే లేనిచో అచట ఎవరున్నను, ఏమియున్నను శోభించనేరవు. దీపముయొక్క అస్తిత్వముచేతనే అవియన్నియు ప్రకాశించుచు, శోభాయమానముగ గన్పట్టును. అయితే దీపమునకు తానన్నిటిని ప్రకాశింపజేయుచున్నాననను గర్వముకాని, తనవలన అన్నియు ప్రకాశించుచున్నవను అహంభావముకాని లేనేలేవు.

అట్లే ఆత్మయను దీపము క్షేత్రజ్ఞుడుగా నుండి ఈ శరీరము, ప్రపంచము అను క్షేత్రమునంతను ప్రకాశింపజేయుచున్నది. అది శరీర రూప ఉపాధికంతకు వెలుగునిచ్చుచున్నది. దేహము, ఇంద్రియములు,

మనస్సు, బుద్ధి మున్నగువానినన్నిటికినీ తేజమొసంగుచున్నది. నాటక మందలి దీపమువలె సర్వసాక్షిగానుండి ఈ జగన్నాటకమునంతను సాక్షిగా వీక్షించుచున్నది.

నాటకము జరుగునపుడు కొందఱు పాత్రధారులు నవ్వుచుందురు. మరికొందఱు ఏడుపును అభినయమొనర్చుచుందురు. కొందఱు సంతోషముగాను, మఱికొందఱు దిగులుగాను ఉందురు. కొందఱు శృంగారరసమును, కొందఱు వీరరసమును, కొందఱు అద్భుత, భయానక రసములను అభివ్యక్తమొనర్చుచుందురు. కాని దీపము మాత్రము నిర్వి కారముగనే ఉండును. పాత్రధారుల వికారములతో దానికేమాత్రము సంబంధములేదు.

అట్లే ఈ ఉపాధియందు ఆత్మయు జీవుడు పొందు సుఖదుఃఖాదు లతోగాని, ఇంద్రియ మనంబులు పొందుచుండు వికారములతోగాని ఏలాటి సంబంధము లేనిదై నిర్వికారముగ వెన్నొందుచుండును. నాటకదీపము నాటకమును, పాత్రధారులను, దర్శకులను, ఇతర సామగ్రిని ప్రకాశింప జేయుచు, ఆయా వ్యక్తుల భావములతోను, వృత్తులతోను, వ్యవహార ములతోను, వికారములతోను ఎట్టి సంబంధమున్ను లేక నిశ్చలముగ వెలుగొందుచుండునట్లు ఈ ఉపాధియందాత్మయు శరీర బుద్ధ్యాదులన్నిటిని ప్రకాశింపజేయుచు తాను మాత్రము నిర్వికారమై, నిశ్చలమై భాసించు చుండును.

జీవుడు అజ్ఞానవశమున తాను పాత్రధారియని భావించుకొనుచు సుఖదుఃఖములకు లోనగుచున్నాడు. ఇది గొప్ప పొరపాటు. జీవుడు వాస్తవముగ పాత్రధారికాదు. సూత్రధారి. ఉపాధికాదు. ఉపాధికి సాక్షిగ నుండు ఆత్మ. ఈ విషయమును తెలిసికొనజాలక మోహవశమున నానా దుఃఖములకు లోనగుచున్నాడు. నాటకమందలి దీపమువలె ఈ జగన్నా టకమున జీవుడు వాస్తవముగ దీపమగు ఆత్మయేకాని పాత్రధారి కాదు. ఈ

సత్యమును అతడు ఎంత శీఘ్రముగ తెలిసికొనిన అంత ధన్యుడు కాగలడు. లేనిచో బహుజన్మలు సంసారదుఃఖకూపమున ఇంకను ద్రొర్లవలసియుండును. ఆత్మయొక్క సర్వసాక్షిత్వమును గూర్చి శాస్త్రము ఈ ప్రకారముగ చక్కగ వర్ణించి చెప్పినవి–

1) నృత్యశాలాస్థితో దీపః ప్రభుం సభ్యాంశ్చనర్తకీం
దీపయే దవిశేషేణ తదభావేఽపి దీప్యతే.

2) అహంకారః ప్రభుస్సభ్యావిషయానర్తకీ మతిః
తాలాదిధారిణ్యక్షాణి దీపస్సాక్ష్యవభాసకః

'నృత్యశాలయందున్న దీపము రాజును, సభ్యులను, నర్తకిని ప్రకాశింపచేయుచున్నది. వారు లేనప్పుడుకూడ ఆ దీపము వెలుగుచునే యుండును'.

అహంకారమే రాజు. విషయములే సభ్యులు. బుద్ధియే నర్తకి. ఇంద్రియములే తాళము వాయించువారు. ఆత్మయే సాక్షియగు దీపము.

కాబట్టి సాధకుడగువాడు ఈ ఉపాధియందు తాను సర్వసాక్షియగు ఆత్మదీపమేకాని, దేహాది దృశ్యపదార్థములు కాదని విశ్వసించి, అద్దాని యందే అహర్నిశములు నిలకడ కలవాడై దృశ్యవ్యామోహమునకు తిలాంజలి యొసంగి పరమానందమనుభవించుగాక!

○○

## దాల్భ్య ఉవాచ

కింతస్య బహుభిర్మంత్రైర్భక్తిర్యస్య జనార్దనే
నమోనారాయణాయేతి మంత్రః సర్వార్థసాధకః

ఎవనికి జనార్దనునియందు భక్తి కలదో, ఆతనికి పెక్కు మంత్రములవలన ప్రయోజనమేమి? 'ఓమ్ నమో నారాయణాయ' అను మంత్రమొక్కటియే సర్వార్థసాధకమై యొప్పుచున్నది.

# జీవ దేవ సంవాదం

శ్రీ ఆర్.వి.ఎస్. కామేశ్వరశర్మ గారు (దేవరపల్లి)

జీవుడు— ఏమిటయ్యా ఓ స్వామీ
చెప్పవయ్యా నీ లీలా ॥ఏమిటయ్యా॥

పుట్టలోన గుట్టలోన
కొండలోన కోనలోన
నీవున్నావని యన్నావు
కానరావేమి దేవా? ॥ఏమిటయ్యా॥

దేవుడు— అన్నిటిలో నేనున్నాను!
అంతటనూ నేనున్నాను
ప్రతి అణువున నేనుంటేను
గుడ్డివాడవైతివి నీవు ॥అన్నిటిలో॥

సత్యమును విశ్వసించి,
స్వార్థమును సన్న్యసించి
ప్రేమయనే మూడోనేత్రం
తెరచి చూడ ఒక్కసారి ॥సత్యమును॥

అంతటనూ నేనే కాదా?
అన్నిటిలో నేనే గాదా?

OO

# భాగవత నవనీతము

## దుర్గుణజయోపాయములు

రజస్తమశ్చ సత్త్వేన సత్త్వం చోపశమేన చ
ఏ తత్సర్వం గురౌభక్త్యా పురుషోహ్యం జసాజయేత్
(భాగవతం 7-15-25)

"రజోగుణ, తమోగుణములను సత్త్వగుణముచే జయించివేయవలెను. (నిర్వికల్పాత్మ స్థితియను) ఉపరతి ద్వారా సత్త్వగుణమును దాటిపోవలెను. దుర్గుణములన్నింటిని సాధకుడు గురుభక్తియొక్క సాహాయ్యముచే శీఘ్రముగ జయించివేయగలడు". భాగవత సప్తమస్కంధములోని పదునైదవ అధ్యాయమున నారదుడు ధర్మరాజునకు మోక్షప్రాప్తికి వలసిన సాధనముల నుపదేశించుచు దుర్గుణ సమూహమునెట్లు జయించివేయవలెనో ఈ ప్రకారముగ విశదీకరించి చెప్పెను. అంతః కరణము నిర్మలముగ నుండిననేతప్ప ఆత్మసాక్షాత్కారమెవరికిని కానేరదు. కావున దానియందలి దోషములన్నిటిని సాధకుడు బాగుగ పరిశీలించి, ఒక్కొక్కదానిని వివేకముయొక్క సహాయముచే లెస్సగ తొలగించివేయవలెను.

రజోగుణ తమోగుణములు పరమార్థ లక్ష్య సంసాధనయందు గొప్ప ప్రతిబంధకములైయున్నవి. వానిని ముముక్షువు దూరీకరించవలెను. వానిని తొలగించివేయు మార్గమిచట తెలుపబడినది. సత్త్వగుణ సంపాదనమే ఆ మార్గము. ఋణము పోవలెననిన ధనమునెట్లు సంపాదించవలెనో, పాపము తొలగవలెననిన పుణ్యమునెట్లార్జించవలెనో, అంధకారము నశించవలెననిన ప్రకాశావిర్భావము యెట్లేర్పడవలెనో, అట్లే రజోగుణ, తమోగుణ రూప దుష్టద్వయమంతరించవలెననిన, సత్త్వగుణ రూప సల్లక్షణమునే జీవుడాశ్రయించవలెను.

అధిక నిద్ర, మత్తు, సోమరితనము (అలసత్వము) మున్నగునవి తమోగుణ లక్షణములు. కామ క్రోధాది దుర్గుణములు రజోగుణ లక్షణములు. కరుణ, దయ, ప్రేమ, పరోపకారము మున్నగునవి సత్త్వగుణ లక్షణములు. కావున సత్త్వగుణ లక్షణములైన దైవిక గుణములను జీవుడాశ్రయించి రజోగుణ, తమోగుణ లక్షణములను

హృదయమునుండి పారద్రోలవలెను. పాపమును గెంటివేయగల స్తోమత పుణ్యమునకు గలదు. కావున జీవుడు మొట్టమొదట పుణ్యసంపత్తి నాశ్రయించవలెను. 'రజస్తమశ్చ సత్త్వేన' అను పై భాగవత వాక్యము యొక్క భావమిదియే అయియున్నది.

అయితే కేవలాత్మస్థితియందు, అనగా నిర్వికల్ప సమాధియందు జీవుడు సత్త్వగుణమును కూడ దాటివైచి గుణాతీత స్థితిని, లేక నిర్గుణస్థితిని బడయును. అత్తఱి శుభాశుభ సంకల్పములెవ్వియు లేక కేవలము నిస్సంకల్పస్థితి, ఆత్మస్థితియే జీవునకుండును. అది సర్వోత్తమ దశయని యెఱుగవలెను. సత్త్వగుణము పవిత్ర వంతమైనను, అదియు దృశ్యవర్గమున జేరినదగుటచే ప్రకృతి స్వరూపమే యగును.

కావున ఏనాటికైనను మనుజుడు దానిని గూడ దాటివైచి దృక్స్వరూపమగు కేవలాత్మస్థితిని గ్రహించవలెను. అయితే సత్త్వగుణము నిర్మలమైనదియు, ప్రకృతి యొక్క శుద్ధాంశమును అయియుండుటవలన జీవన్ముక్తులగు మహనీయులు తమ వ్యుత్థానదశయందు ఆ సత్త్వగుణము నాశ్రయించి దైవీసంపత్తిని జేబూని లోకోప కార కార్యముల నొనర్చుచుందురు. కావున సాధకుడగువాడు మొట్టమొదట రజస్తమోగుణములను, వాని కార్యములను త్యజించివైచి సత్త్వగుణమువఱకు వచ్చి దానిని లెస్సగ పదిలపఱచుకొనవలెను. ఆ పిమ్మట క్రమముగ అభ్యాసవశమున దానిని గూడ దాటివైచి నిర్గుణ కేవలాత్మస్థితిని బొందవలెను. ఇదియే జీవిత లక్ష్యము.

కామాది దుర్గుణములన్నిటిని మనుజుడు గురుభక్తిచే బాగుగ జయించి వేయగలడు. ఏలననగా, గురుభక్తి పరిపూర్ణముగ గలవాడు గురువాక్యములను కార్యాన్వితమొనర్చుటకై బద్ధకంకణుడైయుండును. గురువు నడచిన పంథాను తానున్ను చక్కగ అనుసరించును. గురువుయొక్క ఆచరణయే తానున్ను గలిగి యుండులాగున యత్నించును. కాబట్టి గురుభక్తిగలవాడు దుర్గుణములన్నిటిని అవలీలగ దాటివేయగల్గును. మఱియు గురుభక్తి వలన మనుజుడు గురుకృపకు పాత్రుడు కాగల్గును. సర్వేశ్వరుని యొక్కయు, సద్గురునియొక్కయు కృపావిశేషము గలవాడు, వారల యనుగ్రహమును జూరగొనినవాడు మాయాబంధమును, ప్రకృతి దాస్యశృంఖలములను సులభముగ ఛేదించివేయగలడు.

కావున మోక్షకాంక్షియగు మానవునకు గురుభక్తి, దైవభక్తి అత్యంతావశ్యక ములైయున్నవి. దుర్గుణజాలమును విచ్ఛిన్నమొనర్చుటయందివ్వి ప్రముఖ పాత్రను వహించుచున్నవి. కనుక ముముక్షువు వీనినేకాలమందును వదలరాదు. ఈ ప్రకారముగ పెక్కు ఉపాయములచే జీవుడు తనయందున్న కామాది దుర్వాసన లను పారద్రోలి, దుర్గుణములను రహితమొనర్చుకొని, విశుద్ధ హృదయుడై బ్రహ్మానుభూతిని ఈ జన్మయందే పడసి ధన్యుడు కావలయును. ○○

# నామసంకీర్తన



1. శ్రీ భువనేశ్వరీ త్రిపురసుందరీ । రాక్షసనాశని పాలయమాం
శివశక్తి రూపిణీ రాజరాజేశ్వరీ । శ్రీ చక్ర రూపిణీ
పాలయమామ్॥

2. అఖండ జ్యోతీ నమో నమో । ఆనంద జ్యోతీ నమో నమో
జ్యోతీ జ్యోతీ నమోనమో । దివ్య జ్యోతీ నమో నమో
అంతర్జ్యోతీ నమో నమో । అనంత జ్యోతీ నమో నమో
నిర్మల జ్యోతీ నమో నమో । నిశ్చల జ్యోతీ నమో నమో
పూర్ణజ్యోతీ నమో నమో । పరంజ్యోతీ నమో నమో
జయ జయ జ్యోతీ నమో నమో । మంగళ జ్యోతీ
నమో నమో॥

3. నారాయణా హరి నారాయణా హరి । నారాయణా వేదపారాయణా
శంభో మహాదేవ శంభో మహాదేవ । శంభో మహాదేవ
శంకరశివా॥

4. పన్నగభూషణ పరమశివా
పార్వతీరమణా సదాశివా॥ OO

Know you are the Infinite, then fear must die.

నేను అనంతుడను (ఆత్మను)- అని తెలిసికొనుము. అపుడు భయము తప్పకుండా అదృశ్యమగును.

## శ్రీ రామకృష్ణ పరమహంస ఇట్లు చెప్పిరి–

1. భగవంతుడు మాయాధీశుడై జీవులను, వారి చర్యలను సాక్షిగ గమనించుచున్నాడు. మాయకు లోబడిన జీవుడు భగవానుని దర్శించ లేకపోవుచున్నాడు. దైవానుగ్రహముచే ప్రయత్నపూర్వకముగ మనస్సును శుద్ధముగ చేసుకొన్నచో భగవత్సాక్షాత్కారము కలుగును.

2. తరించుటకు ఆటంకములు లేని స్థలమందుగాని, ఏకాంతమందుగాని, అంతరంగమందుగాని మనుజుడు భగవద్ధ్యానమును చేయవలెను.

3. భగవంతుని పొందుటకు భక్తిమార్గము చాల సులభమైనది. ఈ మార్గమందు భక్తుడు తనను పూర్తిగా భగవంతునకు అర్పించుకొని, దైవచింతన చేయుచు, దైవసాన్నిధ్యమును పొంది పరమశాంతిని అనుభవించును.

4. జ్ఞానము వలన విశ్వము యొక్క ఏకత్వము అనుభవమునకు వచ్చును. అజ్ఞానము వలన సృష్టియందు భేదభావము కలుగును.

5. దైవప్రాప్తిని ఆత్మానుభూతిని అభిలషించువాడు దృశ్యవస్తువుల యెడల విరక్తి కలిగి దైవప్రార్థనను చేయుచుండవలెను. వైరాగ్యము బాగుగా కలిగిన పిదప మహాత్ముల సాంగత్యమును, అవలంబించవలెను. అచట మహాత్ముల బోధలను ఆలకించుచు శ్రద్ధతో, భక్తితో శమదమాది సాధనలను ఆచరించవలెను. ఇట్లు అభ్యాసము చేయుచు రాగా అతని మనస్సు నిర్మలమగును. అత్తఱి దైవానుగ్రహమువలన అతడు భగవత్సాక్షాత్కారమును బడసి అమితానందమును అనుభవించును. ○○

# సర్వమత సామరస్యము

శ్రీ శివానంద స్వాములవారు (ఋషీకేశము)

సర్వమతముల సారము ఒకటే;
సేవించు, ప్రేమించు, దానము చెయ్యి, పవిత్రమొనర్చుకో;
సజ్జనుడవై, సత్కార్మల నాచరించు దయాదాక్షిణ్యముల గల్గియుండు;
ఆత్మపరిశీలనవలన ఆత్మను తెలిసికొని, స్వేచ్ఛను పొందు;
సర్వులను ప్రేమించు, సర్వులను సేవించు,
అందరిలోనున్న భగవంతుని సేవించు;
సత్యమునే పల్కు, శుచిగానుండి, అడకువతో మెలగు;
ధారణ, ధ్యానములు సల్పి, ఆత్మ సాక్షాత్కారము పొందు;
ఇవే సర్వమతముల ముఖ్య సూత్రములు,
వేషభాషలు, పద్ధతులు, ఉత్సవములు– ఇవి అప్రధానములు.
స్వల్ప అప్రధాన విషయములపై పోరాటమేల?
ప్రార్థన, ఉపవాసము, దానము, తీర్థయాత్రలు,
ఇవి సర్వమతముల ప్రథమ సోపానములు,
సహనము, ఉదారత, హృదయ విశాలత కల్గియుండు;
మహాత్ములందరిని, ఋషీశ్వరులందరిని, దేవదూతలందరిని
గౌరవించు;
మహాత్ములందరిది ఒకటే భాష సుమా!

OO

# ఆత్మ అనుభవైకవేద్యము

**ఒ**క ఊరిలో ఒక ఎలిమెంటరీ పాఠశాల కలదు. ఏడవ తరగతి వఱకు అచట విద్యాబోధనము జరుగుచుండును. అది ప్రభుత్వ సంబంధమైన పాఠశాల కావున తల్లితండ్రులు విశేషముగ ఆ పాఠశాలకే తమ పిల్లలను పంపుచుండిరి.

ఒకనాడు ఒక క్లాసులో ఉపాధ్యాయుడు పాఠమును బోధించుచుండగా ఒక పిల్లవాడు అల్లరిచేసెను. అతడు క్రమశిక్షణకు భంగము కలుగజేయుట వలన మాష్టారుగారు ఆ విద్యార్థికి దండన విధింపదలంచి బెత్తముతో వీపుమీద వడ్డించెను. దెబ్బ తగులుట తోడనే పిల్లవాడు కెవ్వున ఏడ్చెను.

అపుడు ఉపాధ్యాయుడు 'ఎందుకేడ్చుచున్నావు?' అని అడుగగా పిల్లవాడు 'మీరు కొట్టినారుగదా, వీపు నొప్పిగా వున్నది' అని చెప్పెను. అపుడు వెంటనే ఉపాధ్యాయుడు 'నాయనా! నొప్పి అంటే ఏమి?' అని అడిగెను. పిల్లవాడు 'బాధ' అని చెప్పెను. 'బాధ' అంటే ఏమిటి? అని మాష్టారు గారడిగిరి. అపుడు పిల్లవాడు 'ఎవరికి వారు దెబ్బతిని దానిని అనుభవించవలసినదే? అది చెప్పుటకు వీలుపడదు'-అని సమాధాన మొసంగెను.

అట్లే ఆత్మానుభూతి ఎట్టిదో, బ్రహ్మానందమెట్టిదో, ఎవరును నోటితో చెప్పజాలరు. మనస్సుచేతను ఊహించలేరు. అది అనుభవైక

వేద్యమే అయియున్నది. వాక్కు, మనస్సు దైవమును చేరలేవు. అవి కొంత దూరము వెళ్లి తిరిగివచ్చును. సాధకునకు నిర్వికల్ప సమాధియందు మనస్సు లయముకాగా ఆత్మస్వరూపము చక్కగ అనుభూతమగును. ఆ స్థితి వర్ణనకు అతీతమైనది.

నీతి : ఆత్మానందము, బ్రహ్మానందము, దైవానుభూతి నోటితో వర్ణింపదగిన విషయములు కావు. మనస్సుచేతను ఊహింపదగిన విషయములు కావు. అవి అనుభవైకవేద్యములు. మనస్సు, సంకల్పములు విలయములు కాగా శేషించు వస్తువే ఆత్మ. అట్టి ఆత్మస్థితియందు జీవుడు అనిర్వచనీయమగు ఆనందముననుభవించును. అది వాక్కులకు అలవి కాదు. అట్టి ఆత్మస్థితియే మనుజుని జీవితలక్ష్యము.

OO


**STATEMENT OF OWNERSHIP AND OTHER PARTICULARS OF VEDANTABHERI**
**FORM 1V (See Rule 8)**

| | |
|---|---|
| 1. Place of Publication | VIJAYAWADA |
| 2. Periodicity of its Publication | MONTHLY |
| 3. Printer's Name | VEMURI BALARAM |
| Whether citizen of India? | Yes |
| Address | Anil Buildings<br>Suryaraopet<br>P.B.No.323<br>VIJAYAWADA-520 002 |
| 4. Publisher's Name | VEMURI BALARAM |
| Whether citizen of India? | Yes |
| Address | Anil Buildings<br>Suryaraopet<br>P.B.No.323<br>VIJAYAWADA-520 002 |
| 5. Editor's Name | B. ESWAR |
| Whether citizen of India? | Yes |
| Address | Sri Sukabrahmashram<br>Srikalahasti-517 640<br>chittoor Dt. |
| 6. Name and address of individuals who own the News paper and partners of share holders holding more than one percent of the total capital | Sri Vidya Prakashanandagiri Swamy<br>Sri Sukabrahmashram<br>Spiritual Institution<br>Srikalahasti-517 640 Chittoor Dt. |

I, Vemuri Balaram, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Date : 1st March 1992

**(Sd) VEMURI BALARAM**
Signature of the Publisher

# ప్రశ్నోత్తర వేదిక ?

## సందేహాలు - సమాధానాలు

డాక్టర్ ఎస్.బి.రఘునాథాచార్యులు గారు M.A., Ph.D.
(తిరుపతి)

**ప్రశ్న : ఎలాంటివారు పరమభక్తులు? వారెలా భగవంతుణ్ణి సేవిస్తారు?**

**జవాబు :** ఎవరు భగవంతునియందే తత్పరమైన భావనతో మనస్సును నిలిపి శ్రద్ధతో ఉపాసన చేస్తారో వారు పరమభక్తులు. కాయిక-వాచిక-మానసిక కర్మలను చేస్తూనే అవి అన్నీ భగవంతుడే చేస్తున్నాడనీ, ఆయన సంకల్పంతోనే అవన్నీ జరుగుతున్నాయనీ, తాను నిమిత్తమాత్రుడననీ భావిస్తూ, ఆ రూపంగా దేవునికి సేవ చేస్తున్నానని భావిస్తే, మనస్సు ఎప్పుడూ ఆయనపైనే నిలపడానికి వీలుపడుతుంది. అదే భగవంతుణ్ణి సర్వదా సేవించే పద్ధతి.

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః

(భగవద్గీత 12-2)

**ప్రశ్న : అనన్య భక్తితో భగవంతుణ్ణి నమ్మి సేవించేవారిని ఈ సంసార బంధం నుంచి ఆయన సముద్ధరిస్తాడా?**

**జవాబు :** తప్పకుండా అటువంటి పరమభక్తులను నాశభూయిష్టమైన సంసార సముద్రంనుంచి భగవంతుడు సముద్ధరిస్తాడు. అయితే వారు సర్వకర్మలను భగవంతుని పాదపద్మాలలో సమర్పించి, ఎల్లప్పుడు భగవంతునిపైన ఆసక్తి కలిగిన మనస్సుతో, ఆయన్నే ధ్యానించాలి. తను ఏ పని చేస్తున్నా, ఏ మాట

# అమృత బిందువులు

క్రోధో మూల మనర్థానాం
క్రోధః సంసారబంధనం
ధర్మక్షయకరః క్రోధః
తస్మాత్క్రోధం విసర్జయేత్.

కోపము అనర్థములన్నిటికిని మూలము. అది సంసారబంధనము. మఱియు అది ధర్మమును నశింపజేయును. కాబట్టి కోపమును ఎల్లరును వదలివేయవలెను.

మక్షికాః వ్రణమిచ్ఛంతి ధనమిచ్ఛంతి పార్థివాః
నీచాః కలహమిచ్ఛంతి శాంతిమిచ్ఛంతి సాధవః

ఈగలు వ్రుండును కోరును. రాజులు ధనమును కోరుదురు. నీచులు కలహమును కోరుదురు. సజ్జనులు శాంతినే కోరుదురు.

OO

మాట్లాడుతున్నా, ఏ ఆలోచన చేస్తున్నా దాన్ని దైవకృతంగా భావిస్తూ మూడు రకాల కర్మల్లోను భగవంతుని స్మరిస్తూ, మనస్సును ఆయనలోనే ఆవేశింపజేస్తే, అటువంటి భక్తాగ్రేసరులను భగవంతుడు తనవారుగా భావించి తప్పక కాపాడు తాడు. సంసారయాతనలతనికంటవు. సంసార దుఃఖాంబుధినుంచి అలాంటి భక్తులను దేవుడే ఉద్ధరిస్తాడు.

తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్
పార్థ మయ్యావేశిత చేతసామ్॥

(భగవద్గీత 12-7)

OO

# అసూయవలన అనర్థము

ఈశ్వర్

అన్ని దుర్గుణాలకు మూలము అసూయ. అసూయవలననే దుర్యోధనునికి పాండవులంటే గిట్టలేదు. పాండవులు సుఖంగా, సంతోషంగా వుండుటవలన దుర్యోధనునికి అన్నము సహించలేదు. ఇట్టి అసూయే మహాభారతయుద్ధమునకు మూలకారణమయ్యెను. అలజడులు, ఆవేశాలు, కక్షలు, కార్పణ్యాలు, కాఠిన్యాలు, కలహాలు జరుగుటకు కూడ ఈ అసూయే కారణము.

"ఓ అర్జునా! నీకు అసూయలేదు కావుననే గీతనుపదేశిస్తున్నాన"ని శ్రీకృష్ణ భగవానుడు గీత 9వ అధ్యాయము మొదటి శ్లోకములో వివరించియున్నారు. దీనిని బట్టి శ్రీకృష్ణుని దృష్టిలో అసూయ అను దుర్గుణము ప్రమాదకరమైనదని తెలియుచున్నది.

అసూయ అనగా తోటి వ్యక్తి ఆనందంగా, సుఖంగా, శాంతిగా, సంతోషంగా వుండుట చూచి ఓర్వలేనితనమే!

"తనకు సంపదలు లేకపోయినను బాధలేదు. కాని ఎదుటివానికి సంపదలు వుండరాదు" అను మనస్తత్వముగలవారు సమాజములో అక్కడక్కడ కనుపిస్తున్నారు. వీరు సమాజమునకు చీడపురుగువంటివారు.

వందల గజాల విస్తీర్ణముగలిగిన మర్రిచెట్టును సహితము క్షణాలలో మాడి పోవునట్లు, ఎండిపోవునట్లు చేయు శక్తి వేరుపురుగునకు గలదు. అదే విధముగా ఎంతటి గొప్పవారిలోనైనను అసూయ అను వేరుపురుగు ప్రవేశించినచో ఆ వ్యక్తిని అది సర్వనాశనముచేయును, దహించివేయును. కావున అసూయ విషయములలో చాలా జాగరూకత వహించవలయును.

ఒకానొక వ్యక్తి ఒక ముసలమ్మను "అమ్మా! నీ ఇంట్లో దొంగలు పడ్డారుగదా! అన్నీ దోచుకెళ్ళారు. కాని నీవు సంతోషంగా వున్నావు. కారణం ఏమిటి? నీకు వేదాంత తత్త్వము ఏమైనా జీర్ణమయిందా?" అని అడుగగా—"మా ఇంట్లో వస్తువులకంటే మా పక్కింట్లోవారి వస్తువులు ఎక్కువ మొత్తములో దొంగతనము జరిగినందులకు సంతోషంగా వుంద"ని సమాధానము చెప్పిందట ఆ ఇల్లాలు.

దీనినిబట్టి అసూయ ఎంత అల్పమయిన గుణమో ఊహించుకొనవచ్చును.




- భగవన్నామ సంకీర్తనము భవరోగమునకు దివ్యౌషధము.
- మతము, జీవితము రెండు కావు ఒకటే.
- అన్నీ మన మేలు కొఱకే అని తలంచువానిని ఎట్టి క్లిష్టపరిస్థితి కూడ కలతపెట్టలేదు.
- ఆత్మశుద్ధిగల వ్యక్తి బోధకులకంటె ఎక్కువ కార్యము సాధించగలడు.
- ఆత్మ సాక్షాత్కారమే జీవితపరమావధి.
- సత్యము, జ్ఞానము, ధర్మము, దయ, శాంతి, ఓర్పు—అనునవే ఆప్త బంధువులు.
- నేను, నాది అను త్రాళ్లచే జీవుడు కట్టబడుచున్నాడు. వాటిని విడదీసు కొనవలెను. ○○

---

⇨ ఒక ధనికుడు అన్న సమారాధన చేయించదలంచి మంచి మేలు రకము సరుకులు తెప్పించి వంట చేయించి అందరికీ భోజనాలు వడ్డించిరట. కాని తిన్న వారందరూ వాంతులు చేసుకొనుచుండిరి. ఎక్కడ పొరపాటు జరిగిందని విచారణ జరిపించగా పులుసు వండిన పాత్రకు కలాయి లేదని తేలిందట. పాత్రకు కలాయి లేని ఒక్క దోషముతో చక్కటి కందిపప్పు తదితర వస్తువులన్నియు ఏ విధంగా వ్యర్థములైనవో అదే విధంగా అసూయ అనునది మానవునిలో ప్రవేశించినచో సమస్త సద్గుణాలను అది వ్యర్థమొనర్చివేయును.

కావున ఆధ్యాత్మికరంగమునగాని, రాజకీయ రంగమునగాని, సాంఘికరంగ మునగాని అసూయను ఎవరును దరికి చేర్చరాదు. అసూయ లేనప్పుడే తాను చేసిన జపధ్యానాది పూజలు సత్ఫలితాలు ఇవ్వగలవు.

అంటరాదు, ముట్టరాదు, తాకరాదు అను పదాలను అసూయకు జోడించుట మంచిది. అనగా అసూయ, ద్వేషము, క్రోధము, హింస మొదలగు దుర్గుణాలకు దూరంగా వుండి వాటిని మాత్రమే అంటరానివిగా, తాకరానివిగా, ముట్టరానివిగా భావించి బహిష్కరించుట మంచిది. ○○

# ఆరోగ్యసాధన

## నీరు

### శ్రీమతి కె. భార్గవి గారు M.Sc., (అనంతపురం)

మంచినీటిని శుభ్రంగా వుంచడం గృహిణుల కర్తవ్యం. ఆకలికైనా ఓర్చుకోవచ్చుకానీ దప్పికకు ఓర్చుకోవడం కష్టము. గాలి తరువాత నీరు మనకు జీవనాధారము. నీటిలో ఔషధ గుణమున్నదని మన ప్రాచీనులు వక్కాణించియున్నారు.

మన శరీరంలో మూడింట రెండొంతులు నీరు కలదు. మన రక్తంలో 79 శాతం, మెదడులో 80 శాతం, ఎముకలలో 10 శాతం నీరు కలదు. ఆహారము జీర్ణమగుటకు, జీర్ణమైనది శరీర భాగములకు పంపిణీ అగుటకు మలమును విసర్జించేందుకు నీరు ఎంతో అవసరం. అంతేకాక శరీరాన్ని శుభ్రపరచుటకు, ఇల్లు శుభ్రముగా పెట్టేందుకు, పరిసరములు శుభ్రంగా వుంచుటకు, వస్తువులు, పాత్రలు ఒకటేమిటి ఏది శుభ్రంగా వుంచాలన్నా నీరు అవసరం. ప్రకృతిలో సహజంగా లభించు నీరు మనకు నిద్ర లేచినది మొదలు ఎన్నోవాటికి ఉపయోగపడుచున్నది.

దినమునకు ప్రతి వ్యక్తి 8 గ్లాసుల నీరు త్రాగుట మంచిదని శాస్త్రజ్ఞులు సూచించిరి. అధికముగ త్రాగినా నష్టమేమి లేదుకాని గడగడ మటుకు త్రాగరాదు. ఆందోళనతో వున్నప్పుడు, చీకాకుగా వున్నప్పుడు, కోపంగా వున్నప్పుడు చల్లని నీటిని సేవించినా ఉపశమనం కలుగును. ఉదయం నిద్ర లేచినప్పుడు 1 గ్లాసు వెచ్చటి నీటిని త్రాగినా మలబద్ధకము వుండదు. ఇది ప్రమాదంలేని పద్ధతి. కావలసినంత నీరు త్రాగని ఎడల రక్తము చిక్కనగును. ఉష్ణము ఎక్కువ అగును.

రాత్రి రాగి పాత్రలో నీరు వుంచుకుని సూర్యోదయానికి ముందే త్రాగినా చాలా మంచిది. మూత్రము పసుపు రంగులో వుంటే వేడిచేసిందని హైరానాపడేకంటే

# ఆత్మ సంధానము

**ముముక్షువులు ఈ క్రింద తెలుపబడిన మహోన్నత భావములను నిరంతరము మననము చేయుచుండవలెను.**

కాలత్రయ విముక్తోస్మి
కామాది రహితోస్మ్యహ
ముక్తిహీనోస్మి ముక్తోస్మి
మోక్షహీనోస్మి సర్వదా॥

**“నేను కాలత్రయ రహితుడను, కామాది వర్జితుడను, ముక్తుడను, సదా బంధ మోక్షరహితుడను.**

OO

---

నీరు విరివిగా త్రాగి చూడండి. అప్పుడు వేడి తగ్గి మూత్రము మామూలు రంగులో వచ్చును.

చాలామంది ‘మంచినీటి మర్యాద’ అంటూంటారు. కానీ అందులోని (మంచినీటిలోని) విశిష్టతను గమనించినవారెవరూ మంచినీటిని అంత చులకన చేయరు. అతిథి మర్యాదకింద ఇచ్చు కాఫీ, టీ, మూత్రపిండాలకు ప్రమాదకరము. అందువలన నాగరికమనుకుని ఈ పానీయాలు ఇచ్చేకంటే వాటికంటె చల్లని మంచినీరు, మజ్జిగ, నిమ్మరసం పిండిన షర్బత్ ఎంతో మంచిది.

మంచినీటిని విరివిగా వాడుటేకాక శుభ్రంగా వుంచడం (ముఖ్యంగా చిన్న పిల్లలున్న ఇంటిలో) ముఖ్యం. మంచినీటిని, ఆహారపదార్థాలను పరిశుభ్రంగా వుంచే బాధ్యత స్త్రీలదే అయినప్పటికి కుటుంబములోని ప్రతి ఒక్కరు కూడా శుభ్రతకు దోహదం చేయాలి అన్న అంశం మరువకూడదు.

OO

# సృష్టిలోని వింతలు - విశేషాలు

1. ప్రపంచములో మిక్కిలి ఎత్తైన పర్వతములు
   1. ఎవరెస్టు – 8848 మీటర్ల ఎత్తు
   2. కాంచనగంగ – 8585 " "
   3. ధవళగిరి – 8172 " "
   4. అన్నపూర్ణ – 8078 " "

   ఇవి యన్నియు హిమాలయ పర్వతశ్రేణిలోనే కలవు.
2. రష్యాలో అజెర్‌బెయిజాన్ ప్రాంతములో నివసించుచున్న అల్లాఖ్యరోవా అనునతని వయస్సు 1990వ సంవత్సరంనాటికి 151 సంవత్సరములు.
3. బృహస్పతి మీద 30 వేల మైళ్ల పొడుగు, 7 వేల మైళ్ల వెడల్పు కలిగిన ఎఱ్ఱటి పెద్ద బింబమొకటి కనిపించుచుండును.
4. రష్యాలోని అజెర్‌బెయిఝాన్‌లో 90 సంవత్సరములకు పైబడిన వయోవృద్ధులు 15,000 మంది కలరు.
5. 1883వ సంవత్సరమున ఇండోనేషియాలోని కారకోటా అగ్ని పర్వతము బ్రద్దలై భయంకరమైన శబ్దమేర్పడినది. ఆ శబ్దము 3 వేల మైళ్ల వరకు వినిపించినది.
6. భూమిపైనుండి చంద్రుని దూరము 2,38,850 మైళ్లు. చంద్రుడు తన చుట్టూ తాను ఒకసారి తిరుగుటకు $27\frac{1}{3}$రోజులు పట్టును.
7. బృహస్పతి తన బృహదాకృతితో తన చుట్టూ తాను తక్కిన గ్రహములన్నిటికంటె వేగముగా తిరుగుచుండును.

OO

# ధర్మం

ఓంప్రకాశ్

"ధర్మం బాబూ" అంటూ భిక్షగాడు వచ్చి డబ్బా చూపాడు.

"చిల్లర లేదబ్బీ"

"పోనీ రూపాయివ్వండి, నోటైనా ఫర్వాలేదు"

"ఆఁ!" అంటూ తెల్లబోయి చూశాడు పరంధామయ్య.

"సరే, నోటిస్తాగానీ, ఇందాకట్నుంచీ ధర్మం, ధర్మం అంటూ అరుస్తున్నావే. ధర్మమంటే ఏమిటో చెప్పు చూద్దాం" అనడిగాడు.

"ధర్మమంటే...ధర్మమంటే...ధర్మమంటే బాబూ–నాకు తెల్దండీ" అంటూ తల గోక్కుంటూ బిత్తర చూపులు చూడసాగాడు.

"తెలీందే మరి ధర్మం ధర్మం అంటావేంటి?"

"ఏదో అలవాటై పోయింది బాబూ. అడుక్కునేవాళ్లంతా అలాగే అడుక్కుంటా రండి" అన్నాడతను.

"ఇందా అబ్బీ" అంటూ అతని కూతురు అమల భిక్షగానికి పావల బిళ్ల వేసి, తండ్రివైపు చూసింది. భిక్షగాడు దీవిస్తూ వెళ్ళిపోయాడు.

"నాన్నా!ఆ అబ్బి మాటలకేంకాని, నాకూ 'ధర్మం' అంటే ఏమిటో స్పష్టంగా తెలియదు. నువ్వే చెప్పాలి" అంది అమల.

"ఔనమ్మా! ఎంతో గంభీరమైన పదాలు, ఇలా తేలిక పదాలుగా ప్రచారం లోకి వచ్చేశాయి. అదంతా మన ప్రారబ్ధం. విద్యాగంధం లేనివారు ఆ మాటల్ని అలా వాడుతున్నారంటే, కాస్త సహించవచ్చు. కానీ, విద్యావంతులు సైతం ధర్మం, త్యాగం, దానం, సేవ, వైరాగ్యం, జ్ఞానంలాంటి లోతైన అర్థాలుగల పదాలను తేలిగ్గా వాడేస్తు న్నారు. నువ్వు తరుచుగా వింటూనే ఉంటావుకదా, 'గురూ' అన్న మాట ఎంతగా పతనమై పోయిందో!" అన్నాడు పరంధామయ్య ఆవేదనగా.

"ఔను నాన్నా. మరి ధర్మం గూర్చి..."

# దోషం-త్యాగం

## ఓం ప్రకాశ్

సత్యనారాయణ తలుపులు మూసుకుని, తన గీతాధ్యయనంలో లీన మయ్యాడు. గీతా శ్లోకాలను, వాటి అర్థాలను, అంతర్గత భావాలను అధ్యయనంచేస్తూ, అతను పరమానందం చెందుతున్నాడు. గీతాశాస్త్రంలోని శ్లోకాలు ఎప్పటికప్పుడు నూతనంగా, దివ్యార్థయుక్తంగా కనబడుతుంటాయి. దాదాపు పదుకొండవ ఏట నుండే అతను గీతను అధ్యయనం చేస్తున్నాడు. వయసు, జీవితానుభవం పెరుగుతున్నకొద్దీ, గీతా శ్లోకాలలోని భావగాంభీర్యం కూడా పెరుగుతూ వచ్చింది. ఒకప్పుడు ఎందుకు? అని అనుకున్న గీతా శ్లోకాలు నేడు ప్రతి మనిషికి చక్కని జీవితాన్ని అందించే శక్తిగలవన్న అభిప్రాయానికి వచ్చాడు.

నిజమే. ఆధ్యాత్మిక విషయాలకు, జీవితానుభవానికి ఎంతో సామీప్యం ఉంది. అనుభవపు లోతులనుబట్టి ఆధ్యాత్మిక విషయముల రహస్యం బయట పడుతూ వుంటుంది. చిత్తం, ప్రాపంచిక విషయాసక్తి నుండి దూరం అవుతున్న కొద్దీ, ఆధ్యాత్మికతకు దగ్గర అవుతూ ఉంటుంది. మనసు ఇంద్రియ భోగాల నుండి వెనుకకు మరలుతున్నకొద్దీ భగవంతుని తత్వరహస్యం విశదంగా బోధపడుతూ ఉంటుంది. భగవంతుని తత్త్వం బోధపడుతున్నకొద్దీ, మనసులోని రాగభయాదులు తగ్గిపోతుంటాయి.

సత్యనారాయణ అలా తన ఆలోచనలలో లీనమై ఉన్నాడు. అంతలో తలుపులను ఎవరో గట్టిగా బాదటం వినిపించింది. లేచి, వెళ్ళి తలుపు తెరిచాడు. ఎదురుగా కొంతమంది దొంగలు కనబడ్డారు.

"భయపడకండి. మేము మిమ్ములను దోచుకోవటానికి రాలేదు. ఒక చిన్న సహాయం కోసం వచ్చాం" అన్నారు దొంగలు.

సత్యనారాయణ ధైర్యం కూడగట్టుకొని అడిగాడు–

"చెప్పండి. చేతనైతే చేస్తాను"

"మాకు చాలా ఆకలిగా ఉంది. సరుకులు ఇస్తే, మేము వంట చేసుకుని మా ఆకలి తీర్చుకుంటాం" అన్నారు వారు.

వారెవరైతేనేం, ఆకలిగొని వచ్చిన అతిథులు. అతిథులకు అన్నం పెట్టటం గృహస్థుని ధర్మం. అలా భావించి, సత్యనారాయణ వారికా రాత్రికి అన్నం పెట్టి ఆదరించాడు. వారు తిని వెళ్లిపోయారు.

రెండు సంవత్సరాలు గడిచిపోయాయి. ఒకమారు సత్యనారాయణ ఇంటికి ఆ దొంగల మనిషి ఒకరు వచ్చి, అతన్ని తమ స్థావరానికి ఆహ్వానించి తీసుకువెళ్లాడు. అక్కడ దొంగల నాయకుడు అతన్ని ఎంతో గౌరవించాడు.

"ఆ రోజు మీరు మాకు అన్నదానం చేశారు. ఆ మేలు మేమెన్నటికీ మరచి పోలేము. ఆ ఋణాన్ని తీర్చుకోవటం కూడా మాకు సాధ్యం కాదు. అయినా ఏదో ఉడతా భక్తిగా మాకు తోచినంత ఇవ్వదలిచాము. ఇక్కడ మేము సంపాదించిన సొత్తున్నది. ఇందులో ఏ పెట్టైనా మీరు తీసుకోవచ్చు. ఆ పెట్టెలో ఉన్నది మీది అవుతుంది" అన్నాడతను.

సత్యనారాయణ మనసు ఇంకా వాసనామయంగానే వుంది; అందుకని అతను లోభవశుడై, ఒక పెట్టెను స్పర్శించాడు. ఆ పెట్టె నిండుగా బంగారు కాసు లున్నాయి. దొంగల నాయకుడు "ఎవరికీ కనబడనీయకుండా, జాగ్రత్తగా తీసు కెళ్లండి" అని చెప్పాడు. అప్పుడు సత్యనారాయణకు ఏమి చేయాలో తోచలేదు. "పర ద్రవ్యేమల్లోష్టవత్‌గా ఆధ్యాత్మిక సాధకుడుండాలి. "సమ దుఃఖసుఖః స్వస్థః", "సమలోష్టాశ్మకాంచనః" "తుల్య ప్రియా ప్రియోధీర స్తుల్యనిందాత్మ సంస్తుతిః" అన్న గీతా శ్లోకాలు జ్ఞాపకం వచ్చాయి.

వెంటనే సత్యనారాయణ దానికో నమస్కారం పెట్టి, ఆ సిరిని త్యాగంచేసి, ఇంటికి మరలి వెళ్లిపోయాడు. ఆధ్యాత్మిక సాధకునికి ఇలాంటి అనుష్ఠాన వేదాంతం అత్యవసరం. వేదాంతం ఆచరించి జీవించే శాస్త్రం, అంతే తప్ప అది కేవలం మాటల విషయం కాదు. ○○

The presence of those who love God makes a place holy.

దైవ భక్తుల సాన్నిధ్యము ప్రదేశమును పవిత్రవంతముగ చేయును.

# వినోదము-వికాసము

## వటపత్రశాయి

వటపత్రశాయి అగు బాలకృష్ణుడు తన కాలి బొటన వ్రేలును నోటిలో ఉంచుకొని ఉండుట అచటచట చిత్రాల్లో మనం చూస్తూంటాం. ఆ బాలకృష్ణుడు ఎందుకు ఆ విధంగా తన కాలిని నోట్లో పెట్టుకున్నారో, దానికి కారణమేమిటో ఒక కవీశ్వరుడు చమత్కారంగా ఇట్లా వర్ణించాడు–స్వర్గంలో అమృతం ఉంది. దానిని త్రాగకుండా మునీశ్వరులు, మహర్షులు, ముముక్షువులు నా పాదపంకజరసామృతాన్నే ఎందుకు అభిలషిస్తారు. నా కాలిలో ఏముంది–అని తెలుసుకోదలంచినవారై బాల కృష్ణుడు తన కాలి బొటన వ్రేలిని నోటిలో పెట్టుకొని ఉండవచ్చు. కవీశ్వరుడు తన భావాలను బహుచమత్కారంగా తెలియజేశాడు.

స్వర్గంలో అమృతం ఉన్నప్పటికి అది జననమరణ రాహిత్యమను కైవల్యాన్ని, పరిపూర్ణ ఆత్మసుఖాన్ని, మోక్షాన్ని కలుగజేయలేదు. పైగా అది జడమైంది, పంచభూతాత్మకమైంది. అందుచేత సంసార సముద్రాన్ని దాటదలచేవారు ముక్తిని కోరేవారు దాని జోలికి పోరు. వారు శాశ్వతమైన పరమాత్మనే ఆశ్రయిస్తారు. ఆ భగవంతుని దివ్యపాదారవిందాలనే అభిలషిస్తారు. భగవత్పాదాంబుజ భవ్యరసామృత పానమందే దత్తచిత్తులై యుంటారు. అమృతానికి, భక్తి రసామృతానికి చాలా తేడా ఉంది. ఒకటి భౌతికము, రెండవది పారమార్థికము; ఒకటి జడము, రెండవది చైతన్యము. కనుకనే మునీశ్వరులు భగవత్పాదపద్మజనిత భక్తిరసామృతపానము కొరకే నిరంతరము తహతహలాడుతుంటారు.

జీవుడా! దేవుని ఆశ్రయించు; దేవుని పాదపద్మాలు కొలు. భక్తిరసామృతము నుగ్రోలు. క్షణికములగు భౌతిక వస్తువులపై రాగము కలిగియుండకు. శాశ్వత దైవానందమునే వాంఛించు. నిరంతర హరిస్మరణ చెయ్. మానవత్వాన్ని సార్థకం చేసుకో. జై గురుదేవ్.

విహాయ పీయూషరసం మునీశ్వరా
మమాంఘ్రిరాజీవరసం పిబన్తి కిమ్
ఇతి స్వపాదాంబుజ పానకౌతుకీ
స గోపబాలః శ్రియమాతనోతు నః

# శాస్త్ర పరిచయం

## అష్టావక్రగీత

దేహాభిమానపాశేన చిరం బద్ధోఽసి పుత్రక
బోధోఽహం జ్ఞానఖడ్గేన తన్నికృత్య సుఖీ భవ

(అష్టావక్రగీత *1-14*)

"ఓ జనక మహారాజా! దేహాభిమానమను త్రాటిచే చిరకాలము నీవు బంధింపబడియున్నావు. 'నేను దేహమును కాదు, చిద్రూపుడగు ఆత్మనే' అను జ్ఞానము కలిగి అట్టి జ్ఞానమను ఖడ్గముచే ఆ దేహాభిమానమును పారద్రోలి ఆత్మస్వరూపుడవై పరమసుఖమునొందుము"- అని జనక మహారాజును నిమిత్తముగ్గైకొని 'అష్టావక్రగీత' లోకమునకు ప్రబోధము గావించుచున్నది.

జీవుడు వాస్తవముగ చైతన్యమగు ఆత్మయేకాని జడమగు శరీరము కాదు. అతడు పంచభూతాత్మకమగు ఏ వస్తువున్ను కాదు. శరీరమునకు, జడమగు ఈ ప్రపంచమునకు సాక్షియగు ఆత్మయే అతడు. ఇట్టి జ్ఞానము కలిగియుండుటయే మోక్షము. కాని అజ్ఞాన ప్రాభవమువల్ల జీవుడు ఇట్టి జ్ఞానము పొందలేక బహుకాలము ఈ సంసార ప్రవాహమున పడి, శరీరము ఎడల 'నేను' అను అభిమానము కలిగి పుట్టుచు, చచ్చుచు ఈ జనన మరణ ప్రవాహమున తిరుగాడుచు నానాబాధలనొందుచున్నాడు.

ఇపుడు సద్గురుని బోధలవల్లను, సచ్ఛాస్త్రము యొక్క పఠనమువల్లను, ఆత్మజ్ఞానమను ఖడ్గమును సంపాదించి దేహాభిమానమను త్రాటిని దానిచే ఛేదించివైచి సర్వస్వతంత్రుడై పరమానందమొందవలెను.

అష్టావక్రమహా మునీంద్రుడు జనక మహారాజునకు బోధించిన దివ్యమగు జ్ఞానోపదేశమే 'అష్టావక్రగీత'. ముముక్షువులకు చక్కని ప్రబోధము గావించుచున్నది ఈ గ్రంథము.

OO



# వసిష్ఠవాణి

## యోగవాసిష్ఠసారము

ఒకనాడు దశరథుని గృహమునకు విశ్వామిత్ర మహర్షి యజ్ఞవిఘ్ననివారణకై శ్రీరామచంద్రుని బిలుచుకొనిపోవుటకుగాను వచ్చెను. ద్వారపాలుఁడాతని రాకను రాజునకెఱిఁగింప; దశరథుఁడు, వసిష్ఠ వామదేవాది ఋషులు ద్వారముకడకేగి, ఆ మునీంద్రుని సత్కరించి లోనికిఁదెచ్చి మరల పూజాదుల గావించి కుశలమడిగిరి. తదుపరి దశరథుఁడు విశ్వామిత్రునితో నిట్లనెను– "ఓ మహర్షీ! తమ రాకచే నేనపరిమితానందము నొందితిని. తామే కార్యార్థమిటకేతెంచితిరో వచింపుడు. అద్దానిని నేను తప్పక నొనర్తును."

అంతట విశ్వామిత్రుఁడిట్లు పలికెను– "ఓ రాజా! నేను సిద్ధి కొఱకు యజ్ఞమారంభింప మారీచుడు, సుబాహువు మొదలగు గొప్ప పరాక్రమశీలురగు రాక్షసులందు విఘ్నములఁ గలుగజేయుచున్నారు. ఆ (యజ్ఞ) కార్యమున నేను కృద్ధుఁడనై వారిని శపించుట సముచితముకాదు. మీ తనయుఁడగు శ్రీరామచంద్రుఁడు వారలను వధింప సమర్థతగలవాఁడు, కాబట్టి ఇక త్వరలో పూర్తికానున్న తద్యజ్ఞము యొక్క రక్షణార్థము రాముని బంపుఁడు. రాముని పరాక్రమమును, నేను, వసిష్ఠాదులు ఎఱిఁగి యున్నాము. మీరు సంకోచింపకుఁడు. వసిష్ఠాదులును ఇక్కార్యమునకు శ్రీరాముని పంపుటకు అనుజ్ఞనిచ్చుగాక! వారి సమ్మతిచే శ్రీరాముని శీఘ్రముగ నాతోఁ బంపుడు!"

ఆ వాక్యమును విని దశరథుడు మిగుల ఖిన్నుండై ముహూర్త కాలము మౌనముగ నుండి పిమ్మట విశ్వామిత్రునితో నిట్లనెను– "మునీంద్రా! శ్రీరాముడు పదునాఱేండ్లు సరిగా నిండని పసిబాలుడు. సుకుమారుఁడు. అట్టి అతఁడు రాక్షసులతో యుద్ధమెట్లు చేయగలుగును. గొప్ప సేనతో నేనేవచ్చి ఆ రాక్షసులతో యుద్ధమొనర్చెదను. మఱియు రావణాది రాక్షసులైనచో, వారి నెదుర్చుటకు మేమున్ను సమర్థ

లముగాము. ఇక రాముఁడెట్లగును. రాముని తీసికొనిపోయినచో నేనొకక్షణముకూడ బ్రతుకజాలము"

అది విని విశ్వామిత్రుఁడు క్రుద్ధుఁడై దశరథుఁడు తాను జేసిన ప్రతిజ్ఞను భంగము చేయుట ధర్మవిరుద్ధమని పలుకుచు నచటినుండి వెడలిపోనుండగా నంతట వసిష్ఠమునీంద్రుఁడు దశరథునితో నిట్లనెను- "ఓ రాజా! మీరు కావించిన వాగ్దానమును భంగము చేయకుడు. విశ్వామిత్రుఁడు మహాపరాక్రమశాలి. సమస్త అస్త్రశస్త్రముల నెఱిగినవారు. ఈతనిచే సంరక్షితుఁడైన శ్రీరామచంద్రునకేమియు ముప్పు వాటిల్లదు. కాఁబట్టి నిస్సంకోచముగా రాముని బంపివేయుఁడు"

వసిష్ఠమునీంద్రుని యీ వాక్యములను విని దశరథుఁడు ప్రసన్నుఁడై ద్వారపాలునితో రామలక్ష్మణులను శీఘ్రముగ గొని రమ్మని చెప్పెను. ఆతఁడు వెడలి తిరిగివచ్చి ఇట్లు చెప్పెను- "దేవా! శ్రీరామచంద్రుఁడు మిగుల చింతాక్రాంతుఁడై, భోగరాజ్య వైభవాదుల నేమియు నపేక్షింపక ధనసంపదాదులయెడ విరక్తి గల్గి ఆహారవిహారాదులయందుఁ బ్రీతిలేక, వ్యవహారములందిచ్ఛలేక ప్రబల వైరాగ్యయుతుఁడై యున్నాఁడు. ఆతనికి మహానుభావు లెవ్వరైన తగిన యుపదేశముచేసి దుఃఖమును దూరీకరింపవలెను".

అపుడు విశ్వామిత్రుఁ డిట్లనెను- "శ్రీరాముఁడిటకు గొని రాబడుఁగాక! అతని దుఃఖమును మేము దూరీకరించెదము. అది అతని దుఃఖము కాదు. వైరాగ్యమే. బోధ ప్రాప్తానంతర మాతఁడు ఉత్తమమగు ఆత్మపదము నొందును" ఆ వాక్యములను విని దశరథుఁడు ప్రసన్నుఁడై శ్రీరాముని దోడ్కొని వచ్చుటకై కొందఱు దూతల నంపెను.

ఇంతలో శ్రీరాముడు లక్ష్మణ శత్రుఘ్నాదులతో గూడి దశరథుని వద్దకు వచ్చుచుండెను. అట్లాతఁడు వచ్చి తండ్రికి, వసిష్ఠవిశ్వామిత్రాదులకు నమస్కరింపనంత దశరథుఁడు, "నీవు దుఃఖింపవలదు. విషయవైరాగ్యముచే నీవు శూరుండవే అయి యున్నావు" అని పలికెను. OO

The Lord is the only Giver. Get his cheque and it must be honoured everywhere.

ఈ ప్రపంచమున దేవుడొకడే ఇచ్చువాడు. వారి నుండి చెక్కును పొందుడు. అది ఎక్కడైనను చెల్లును.

వీరిని గురించి తెలుసుకొండి

# కర్దముడు

కర్దముడు త్రేతాయుగమునందు నివసించిన ఒక మునిశ్రేష్ఠుడు. అతనికి మిక్కుటమగు నారాయణభక్తి కలదు. సరస్వతీనదీతీరమున అతడు తపోధ్యానాదులను గావించుచుండగ విష్ణుభగవానుడు ప్రత్యక్షమయ్యెను. అంత కర్దముడు భగవంతుని పెక్కురీతుల స్తోత్రము చేసి పూజించెను. విష్ణువు అతనితో "స్వాయంభువు తన కుమార్తెయగు దేవహూతిని తీసుకొని వచ్చినపుడు ఆమెను నీవు ధర్మపత్నిగ స్వీకరింపుము. ఆమె గర్భమున నేను జన్మించెదను" అని పలికి అంతర్ధానమయ్యెను.

కొంతకాలమునకు స్వాయంభువు తన పుత్రికయగు దేవహూతిని తోడ్కొని కర్దమునకు ఒప్పగించెను. అతడు దేవహూతిని భార్యగ పరిగ్రహించెను. దేవహూతి తన పతిదేవునకు పరిచర్యలు చేయుచు కాలము గడుపుచుండెను. ఒకసారి ఆ దంపతులు ఇరువురును బయలుదేరి అనేక పుణ్యక్షేత్రములను దర్శించి వచ్చిరి. అనంతరము వారికి తొమ్మిదిమంది పుత్రికలు కలిగిరి. వారి పేర్లు– కళ, అనసూయ, శ్రద్ధ, హవిర్భువు, గతి, క్రియ, ఖ్యాతి, అరుంధతి, శాంతి.

ఒకనాడు కర్దముడు తన పత్నితో తాను సన్న్యసింపదలచితినని పలికెను. అందులకు దేవహూతి పుత్రికల వివాహము లైన పిదప తనకొక పుత్రుని ప్రసాదించిన తదుపరి సన్న్యసింపుడని ప్రార్థించెను. ఆమె ప్రార్థనను అతడు ఆలకించి, సమ్మతించెను. ఒక సుముహూర్తమున వారికి కపిలుడు జన్మించెను. పూర్వము విష్ణువు వరమొసంగిన ప్రకారము నారాయణుడే కపిలునిగ అవతరించెను. కపిలుడు తన తల్లికి సాంఖ్య శాస్త్రమును బోధించి ఆమెకు జ్ఞానోపదేశము చేసెను.

కర్దముడు ప్రజాపతులలో ఒకడు.

(దైవభక్తిని పెంపొందించుకొనవలెను. భగవదనుగ్రహముచే సకల కార్యములు సిద్ధించును.)

కర్దముని గూర్చిన వృత్తాంతము భాగవతమునందు కలదు. ○○

# జీవుడా మేలుకో!

తనువు నిత్యము కాదురోరన్నా
ధరణిపై నది ఎల్లకాలము ఉండబోదన్నా
దండధరుడు పొంచియుండగ
పాపకార్యము ఏలచేయుదు
పాశహస్తుడు రాకపూర్వమె
ధర్మమార్గము దరికి జేర్చుము.
తత్త్వసారము తెలిసికోరన్నా
సద్గురుని చెంత నిజముగనుగొని లాభమొందన్నా

అజ్ఞాన ప్రభావంచే ఈ ప్రపంచమున జీవుడు అన్ని విషయములందును తలక్రిందులుగ వ్యవహరించుచున్నాడు. ఉన్న దేవుని లేడు అంటున్నాడు. లేని జగత్తును ఉందంటున్నాడు. రేపో మాపో నశించిపోయే శరీరాన్ని శాశ్వతమని భావించి రాగద్వేషాలను, దేహాభిమానాన్ని పెంచుకొంటున్నాడు. శాశ్వతమై, సర్వత్ర విరాజమానమై తన హృదయమందును, సమస్త ప్రాణికోట్లయందును సమముగ వ్యాపించియున్న పరమాత్మ లేడనుచున్నాడు.అందుచే చేయరాని పనులను చేయుచు అధర్మానికి ఒడిగట్టుతూ శరీరాన్ని శాశ్వతమని భావిస్తూ జీవితాన్ని దురుపయోగం చేస్తున్నాడు.

అట్లు చేయరాదు. శాశ్వతమైన ఆత్మను శాశ్వతంగా భావించాలి. జడమైన దేహాన్ని క్షణికమని తెలుసుకోవాలి. తన జీవితము స్వల్పకాలము మాత్రమే అని భావించి, పాపాచరణను దూరీకరించి పుణ్యాచరణము, ధర్మాచరణము గావించాలి. భక్తి జ్ఞానవైరాగ్యములను లెస్సగ సాధించాలి. ఏ క్షణమందు శరీరము రాలిపోవునో అని తలంచి చిత్తశుద్ధికై వలసిన యమనియమాదులను, శమదమాదులను లెస్సగ సంపాదించి ఆత్మజ్ఞానోపార్జనకై నిరంతరం కృషి సలపాలి.

జీవుడా! శరీరమను ఎండుటాకు కాలమను ఝంఝూమారుతంలో కొట్టుకొని పోకపూర్వమే ఈ శరీరంతో చేయవలసిన ఆధ్యాత్మిక సాధనలన్నిటిని త్వరగా పూర్తిచేయి. శీఘ్రముగ గురుసన్నిధిని చేరు. వారు బోధించిన సాధనలను భక్తిశ్రద్ధలతో ఆచరించు. జీవితం పూర్తికాకపూర్వమే ఆత్మానుభూతిని బడసి తరించు. లే, అజ్ఞాన నిద్ర నుండి మేలుకో!

○○



# వేదాంత గోష్ఠి

## నేటి చర్చనీయాంశము–ఉపరతి

శిష్యుడు **(శివప్రసాద్)**–స్వామీ! గురుదేవా! ఆధ్యాత్మిక విషయములు అనుభవైకవేద్యములు. ఎన్ని గ్రంథములు చదివినను, అనుభవజ్ఞుడైన సద్గురువువద్ద బోధ వినినగాని అవి అంతుపట్టవు. నా అదృష్టవశాత్తు అనుభూతిని బడసిన తమ వంటి సద్గురూత్తములు నాకు లభించినారు. నా జీవితము ధన్యమైంది. శమదమాది సాధనలలో తమరిదివరకు మొదటి రెండు అగు శమదమములను గూర్చి విశదీకరించియున్నారు. ఇప్పుడు మూడవదైన **'ఉపరతి'** ని గూర్చి తెలియజేయ ప్రార్థన.

గురువు **(ప్రబోధానంద స్వాములవారు)**–నాయనా! శివప్రసాద్! అట్లే చెప్పెదను, విను. ఉపరతి అనే పదములో ఉప, రతి అను రెండు చిన్న పదాలు ఇమిడి యున్నాయి. 'ఉప' అంటే సమీపము, 'రతి' అనగా ఆసక్తి. అనగా దేవుని సమీపంలో ఆసక్తి కలిగియుండాలి. దైవసాన్నిధ్యాన్ని అభిలషించాలి. బాహ్యమునుండి చిత్త వృత్తులను మరలించి, ఇంద్రియవృత్తులను నిగ్రహించి, వాటిని అంతర్ముఖము చేయాలి. అనేక జన్మల నుండి అజ్ఞాన కారణమున దృశ్యమే గొప్పదని తలంచి మనస్సు దానివైపునే పరుగెడ్తుంది గాని, దృస్వరూపము (ఆత్మ) ఒకటి కలదని గాని, దానియందు లగ్నమైతే అపరిమిత ఆనందం కలుగుతుందనిగాని దానికి తెలియదు. అందువల్లనే అది ఎన్నియో జన్మలందు బహిర్ముఖంగ ప్రవర్తిస్తుంది.

కాని ఇప్పుడు సాధకుడు తన పూర్వపుణ్యమువలన సద్గురువును పొంది, సచ్ఛాస్త్రములను పరికించి, సత్యవిషయమును తెలుసుకొని, బాహ్యవస్తువులలో పూర్ణసుఖము లేదని గమనించి మనస్సును అంతర్ముఖము చేసుకొనుచున్నాడు. ఇట్టి క్రియకే 'ఉపరతి' అని పేరు. మనస్సునకు ఇతర వాంఛలేవియు లేక ఒక్క ఆత్మనే అది ఆశ్రయించుకొని యున్నందువలన దానికి అట్టితటి అపరిచ్ఛిన్నమైన ఆనందము లభిస్తూంటుంది. దుఃఖరాహిత్యము, ఆనందప్రాప్తి–అను ఈ రెండును ఆత్మ సాన్నిధ్యంలో దానికి కలుగుతూంటాయి. ఇదియే ఉపరతి యొక్క గొప్ప

౨౮ కనుకనే మహనీయులు దీనినవలంబించి, బహిర్ముఖత్వానికి స్వస్తిచెప్పి నిరంతర ధ్యాననిష్ఠలో ఉంటుంటారు.

కొందరిట్లు ప్రశ్నిస్తూంటారు–"ఏమండీ! విషయ సుఖాలు ఎంతో ఆనందంగా ఉంటాయికదా! వాటిని ఎందుకు అనుభవించకూడదు. అంతర్ముఖమంటే మాకేమీ తెలియదు. కాబట్టి దానినెందుకు ఆశ్రయించాలి. ఉన్నదానిని పోగొట్టుకొని, తెలియనిదానిని గూర్చి ఎందుకు ఆలోచించాలి?" వారు చెప్పినది తప్పు. బయటి వస్తువులలో కల ఆనందం పూర్ణమైనది కాదు. ఆత్మయందు (బ్రహ్మమునందు)కల ఆనందం పరిపూర్ణమైనది, అది ఎప్పుడూ నశించదు. తెలివిగలవాడు బింబమునే అన్వేషించునుగాని ప్రతిబింబమును కాదు. ఒకవేళ ప్రారంభములో ఆ ఆత్మవస్తువు యొక్క పరిచయం లేకపోయినను గురుబోధలవల్ల శాస్త్ర పరిచయంవల్ల తన యొక్క సాధనాతిశయంచేత అది కాలక్రమమున తప్పక అనుభూతమౌతుంది.

కాబట్టి ఈ సత్యసిద్ధాంతము యెడల విశ్వాసమును, శ్రద్ధనుపెంచుకోవాలి."అది మాకు తెలియదు" అని అనకూడదు. 'తెలియవు'అని అనుకొనిన ఎన్నో విషయాలు ప్రయత్నంవల్ల, అభ్యాసంవల్ల తెలియబడుతున్నాయి. కావున దైవం యెడల (ఆత్మ యెడల, బ్రహ్మం యెడల) విశ్వాసం పెంచుకోవాలి. అవిశ్వాసం ఎన్నడును తగదు.

ఒకవేళ బాహ్య విషయాలను, విషయ భోగాలను ఎంతకాలమనుభవించినను తృప్తి కలుగదు. వాటి యెడల ఆశ తొలగిపోదు. పైపెచ్చు ఆ ఆశ పెరుగుచునే యుంటుంది. కనుక ఎన్ని సంవత్సరములు వాటి వెంట పరుగిడినను శాశ్వత సుఖము ఒకింతేని అతనికి దొరకనే దొరకదు. అటువంటప్పుడు ఆ ప్రకారం చేయటం అమూల్యమైన మానవ జీవితాన్ని వ్యర్థం చేయటమేకదా! కాబట్టి ఏదో ఒక సమయాన ఆ కోరికలన్నిటిని విరమించి, వాటిని పట్టి వ్రేలాడటం ఆపేసి, వాటి వెంట పరుగెత్తటం నిలిపేసి, మనస్సును అంతర్ముఖంచేసి, ఆత్మధ్యానమును అభ్యసించి క్రమముగ అనుభూతిని బడసి జీవుడు తరించాలి. ఈ పద్ధతినే 'ఉపరతి' అందురు. వైరాగ్యము యొక్క ఫలమే ఉపరతి.

నాయనా! శివప్రసాద్! నేను తెలిపిన ఈ భావాలన్నిటిని నీవు బాగా మననం చేసి దైవంపై శ్రద్ధ, విశ్వాసం పెంచుకొని జీవితాన్ని ఆనందమయం చేసుకో.

శిష్యుడు–గురువర్యా! మీ బోధలు వింటూంటే నాకు బ్రహ్మానందంగా ఉంది. అమృతము త్రాగినట్లుగా ఉంది. నా సందేహాలు పటాపంచలైపోయాయి. తమరు చెప్పిన చొప్పున ఆచరించి దైవానుభూతిని బడయుటకై తీవ్రతర ప్రయత్నమాచరిస్తాను. సెలవు. ○○

# గోవు

## శ్రీమతి సంధ్యావందనం లక్ష్మీదేవి గారు M.A.
(సికింద్రాబాద్)

'గావో విశ్వస్యమాతరః' (అథర్వణ వేదము) గోవులు ప్రపంచమునకు తల్లులని వేదము ఘోషించుచున్నది. అనగా బిడ్డకు తల్లిపాలెంత శ్రేష్ఠమో అట్లే మానవులందరికీ ఆవుపాలంత శ్రేష్ఠమైనవని భావము.

మన పూర్వులు గోసంపదను దేశ సంపదగా భావించుచు ఎంత పశు సంపదను కలిగియున్న-అంత ధనవంతులుగా భావింపబడుచుండిరని మన ఇతిహాసముల ద్వారా తెలియుచున్నది. రాజులు విద్వాంసులకు పారితోషికములతోపాటు గోవులను కూడా దానముగ ఇచ్చుచుండిరి.

ఉదాహరణకు : జనక మహారాజు శాస్త్రార్థములో గెలిచిన యాజ్ఞవల్క్య ఋషికి వెయ్యి గోవులను పారితోషికముగ ఇచ్చుట బృహదారణ్యకోపనిషత్తునందు గలదు.

రామాయణములో సీతారాముల కల్యాణ సందర్భముగ దశరథ మహారాజు బంగారు రేకులు తొడిగిన కొమ్ములు కల గోవులను దానమిచ్చిరి.

'యజమానస్య పశూన్ పాహి' యజమాని పశు సంపదను రక్షింపవలయునని ఈశ్వరీయవాణి-యజుర్వేదము ఆదేశించుచున్నది.

*గాం మాహిగ్ంసీః అవిం మాహిగ్ంసీః*
*మా హిగ్ంసీః సర్వాభూతాని* (యజుర్వేదము)

ప్రాణులను హింసింపరాదని వేదము ఉద్బోధించుచున్నది. ప్రాచీన ఆర్య సభ్యతలో అహింసకు మొదటి స్థానమివ్వబడినది. ఈ దేశము అనాదిగ అహింసా ప్రధాన దేశముగ నున్నది. మానవులలో అహింసా ప్రచారము జరుగుచుండెడిది. వామ మార్గము భయంకరముగ వ్యాపించినప్పటినాటి ఒక కథ ఈ జాతి యొక్క స్వాభావిక లక్షణమును తెలియజేయును.

గౌతమ బుద్ధుని చరిత్ర ఆబాల వృద్ధమునకు తెలిసినదే. క్షత్రియ రాజకుమారు

డైన దేవదత్తుడొక హంసను బాణముతో కొట్టి గాయపరచెను. సిద్ధార్థుడా హంసను పరమేశ్వరుని సృష్టిలో నొక అంగముగ భావించి హృదయమునకు హత్తుకొని దానిని సంరక్షించుచుండెను. దేవదత్తుడా హంసను వెదకుచు అచ్చటకు వచ్చెను. ఈ సోదరులిరువురి మధ్య జరిగిన వివాదము చాలా విచిత్రమైనది. తాను ముందుగ బాణముతో కొట్టినందున ఆ హంస తనదని దేవదత్తుని వాదము. గాయపడిన ప్రాణిని హృదయమునకు హత్తుకొని దాని గాయములకు కట్టుకట్టి సేవచేసి రక్షించి నందున అది తనదని సిద్ధార్థుని వాదము. ఇరువురు న్యాయము కొరకు రాజ దర్బారునకు వెళ్ళిరి. చంపువానికంటె ప్రాణములు రక్షించువానికా ప్రాణిపై అధికారము ఎక్కువ యుండునని తీర్పు చెప్పబడినది. చివరకు అహింసయే జయించినది.

వైదిక సంస్కృతిలో గోవునకు అత్యంత ప్రాధాన్యత గలదు. వైదికులు గోవును పూజింతురు. అనగా సత్కరింతురు. చక్కగా పాలించి పోషింతురు. ఏ మతమునకు చెందినవారైనా మానవ మాత్రులకు ఆవు పాలు శ్రేష్ఠమైన, బలవర్ధక మైన, ఆరోగ్యకరమైన ఆహారము. ఆవు పాలు సేవించువారి మేధా శక్తి, జ్ఞాపక శక్తి అమోఘముగ నుండును. ఆవు ద్వారా లభించు వస్తువులకు 'పంచగవ్య'ములని ప్రసిద్ధి. వీనికి ఆయుర్వేద చికిత్సలో ఎంతో ప్రాధాన్యత కలదు. అవి- 1. ఆవు పాలు, 2. ఆవు పెరుగు, 3. ఆవు నెయ్యి, 4. ఆవు మూత్రము, 5. ఆవు పేడ. ఇవన్నియు మానవులకెంతో ఉపయోగకరమైనవి. ఆవు మూత్రము, పేడలతో శుభ్రపరచిన ప్రదేశములలో సూక్ష్మ రోగక్రిములు నశించును. గోమూత్రముతో ఎన్నో వ్యాధులను నివారింపవచ్చును.

మహర్షిస్వామి దయానంద సరస్వతి 'గోకరుణానిధి' యనెడు లఘుగ్రంథములో ఒక్క ఆవు, దాని సంతానము వలన లభించు పాలు, ధాన్యములద్వారా 4,10, 440 (నాలుగు లక్షల పది వేల నాలుగు వందల నలుబది) మంది ఒక పూట భోజనము చేసి సుఖపడగలరని యుక్తిపూర్వకముగ నిరూపించిరి.

ఈ దేశము మొదటి నుండియు వ్యవసాయ క్షేత్రముగ నుండెను. నూటికి 80 శాతం ప్రజలు నేటికిని వ్యవసాయముపైననే జీవించుచున్నారు. ఈ గ్రామవాసు లకు పశుసంపదే మూలాధారము. నేటికిని పాడి పరిశ్రమ, పశువుల పెంపకములతో పేద ప్రజలు జీవించుచున్నారు.

గోవు పరమపూజ్యమైనది. కావున గోసంరక్షణ అతి ముఖ్యమైన కార్యమని జనులు జ్ఞప్తియందుంచుకొనవలెను.

OO

# వేదాంతభేరి శాశ్వత చందాదారులు

## (Life Members)

వేదాంతభేరి మాసపత్రికకు నూతనముగ చేరిన శాశ్వత-చందాదారుల పేర్లు :-

శాశ్వత చందా రు. 300/-లు

1. శ్రీ వేంకటేశ్వర ఆధ్యాత్మిక గ్రంథాలయము –SIIL క్యాంపస్
2. శ్రీ చిలువూరి విజయలక్ష్మి గారు – చండీగర్
3. శ్రీ బి. కృష్ణవేణి గారు – కొవ్వూరు
4. శ్రీ వేమూరి వేంకటేశ్వర్లు గారు – చేబ్రోలు
5. శ్రీ కె. నాగేంద్రరావు గారు – బళ్ళారి
6. శ్రీ సి. మారెప్ప గారు –అనంతపూర్
7. శ్రీ ఎమ్. సోమయప్పయ్య గారు –సూర్యాపేట
8. శ్రీ దేవసాని సత్యనారాయణ గారు – బొంబాయి
9. శ్రీ ఇ. రాఘవేందర్ హనుమాన్ గారు – బొంబాయి
10. శ్రీ గంగాధర్ భూమయ్య తాటిపాముల గారు – బొంబాయి
11. శ్రీ దేవకి డి. అమృతవార్ గారు – బొంబాయి
12. శ్రీ జి.బి. దాషె గారు – బొంబాయి

OO

# భయమేల?

శ్లో॥ రామనామ జపతాం కుతోభయం
సర్వతాప శమనైక భేషజమ్।
పశ్య తాత మమ గాత్ర సన్నిధౌ
పావకోఽపి సలిలాయతేఽధునా॥

సమస్త దుఃఖములను పోగొట్టునట్టి రామనామమును (భగవన్నామమును) జపించువారికి భయమెచట? నా చెంత అగ్నికూడ చల్లగానున్నది -చూడుము!

(ప్రహ్లాదుడు తండ్రితో)

ప్రత్యేక వార్త

# శరవేగముతో సాగుచున్న కంటి ఆస్పత్రి నిర్మాణం

1. భక్తకన్నప్ప పేరుతో ఉచిత కంటి ఆస్పత్రి (త్రినేత్ర వైద్యాలయము) యొక్క భవన నిర్మాణము, శ్రీకాళహస్తి యందలి శ్రీశుకబ్రహ్మాశ్రమమునందు చురుకుగా కొనసాగుచున్నది.
2. 1992 ఏప్రిల్ చివరి వారములో ప్రారంభోత్సవమునకు సన్నాహములు జరుగుచున్నవి.
3. ఉచిత కంటి ఆస్పత్రిని నిర్వహించాలను శ్రీ స్వాములవారి సంకల్పమును కార్యరూపము నొందింపజేయుటకు ఒక కమిటీ ఏర్పడినది.
4. ఆస్పత్రిలో చికిత్స చేయించుకొను రోగులకు అవసరమైన- ఆపరేషన్, మందులు, కళ్ళజోడు, భోజనము ఉచితముగా ఏర్పాటు చేయుటకు తీర్మానింపబడెను.
5. ఈ విధముగా ఉచిత కంటి ఆస్పత్రి నిర్వహణకు రోజుకు రూ. 1,500/- ఖర్చు కాగలదని వైద్యులు అంచనా వేసిరి.
6. ఈ ఖర్చును రోజుకు ఒకరు భరించుటకుగాను తీర్మానించిరి.
7. ఒకరోజు ఖర్చుకుగాను రూ.11,116/- చెల్లించిన, దానిని బ్యాంకులో డిపాజిట్ చేసి, దానిపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము వారు కోరిన రోజు,వారి పేరుతో వైద్యసేవ జరుగును. వారి పేరు ఆ రోజు వైద్యశాల యందు వ్రాయబడును. ఈ విధముగా రూ.11,116/-లు చెల్లించిన వారు శాశ్వత సభ్యులు (Life Members) గా పరిగణింప బడుదురు.
8. ఈ ప్రకారముగ 365 మందిని శాశ్వత సభ్యులు (Life Members) గా చేర్చుకొని వారిద్వారా ఉచిత కంటి ఆస్పత్రి నిర్వహణ జరుపదలంచిరి.

9. ఇప్పటికీ చాలామంది శాశ్వత సభ్యులుగా చేరియున్నారు. వారి పేర్లు తదుపరి సంచికలో ప్రకటింపబడును.

ఎ) ఆస్పత్రి భవన నిర్మాణమునకు అగు ఖర్చు రూ.7 లక్షలలో శ్రీకాళహస్తీశ్వర దేవస్థానమువారు విరాళముగా ఒసంగినది–

**రూ. 4 లక్షలు**

బి) డా॥ టి.బి.జి. తిలక్ గారు, ENT Specialist (ఆపరేషన్ సామాగ్రి కొరకు) హైదరాబాదు. (ఆశ్రమ కమిటీ సహాయ కార్యదర్శి)–

**రూ.1 లక్ష**

సి) శ్రీ యోగయ్యనాయుడు గారు (ప్రముఖ పారిశ్రామికవేత్త, హైదరాబాదు, ఆశ్రమ కమిటీ ఉపాధ్యక్షులు) ఆస్పత్రిలో టైల్స్ వేయించుటకు–

**రూ.1 లక్ష**

డి) శ్రీ గోరకంటి శివయ్య గారు, హైదరాబాదు (కమిటీ సహాయ కార్యదర్శి) ఆస్పత్రి ఎలక్ట్రికల్ సామగ్రి యావత్తు–

**రూ.70,000/– వేలు**

శాశ్వత సభ్యులుగా చేరదలంచినవారు చేరవచ్చును.
వారికి I.T. 80 G క్రింద Tax Exemption కూడా లభించును.

–: డ్రాఫ్టు తీయవలసిన పేరు :–

**"భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి", శ్రీకాళహస్తి**

–: డ్రాఫ్టు పంపవలసిన అడ్రసు :–

**మేనేజరు, శ్రీ శుకబ్రహ్మాశ్రమము–517 640**

**శ్రీకాళహస్తి, చిత్తూరు జిల్లా (ఆం.ప్ర.)**

**Phones 543 & 239 STD Code 085 78**






# కంటి డాక్టరు కావలెను

శ్రీకాళహస్తియందలి శ్రీ శుకబ్రహ్మాశ్రమమునందు 1992 ఏప్రిల్ నెలయందు ప్రారంభము కానున్న 12 పడకల భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రికి శస్త్ర చికిత్సలో నైపుణ్యము కలిగిన M.S. లేక D.O. డిగ్రీ పొందిన డాక్టరు కావలయును. ఉత్సాహముతో వైద్యసేవ చేయు మనస్తత్వము గల వారుగ ఉండవలెను.

జీతము నెలకు రూ.**5000**/-లు.

నైపుణ్యమునుబట్టి ఇంకను ఎక్కువ ఇవ్వబడును ఉత్సాహము గలవారు తమ వివరములతో ఈ క్రింది అడ్రసుకు అప్లికేషను పంపగోరుచున్నాము.

శుకబ్రహ్మాశ్రమము–517 640
శ్రీకాళహస్తి, చిత్తూరు జిల్లా (ఆం.ప్ర.)
Phones : Off. 239 Res. 543 STD Code 08578

1. ఫిబ్రవరి ప్రారంభములో శ్రీ స్వాములవారు బొంబాయి సెంచురీ మిల్ వారి ఆహ్వానమును పురస్కరించుకొని, మిల్ ఆవరణలో 55వ గీతామహోత్సవమును జరిపిరి. బొంబాయినందు గల తెలుగువారు విశేషముగ ఆ కార్యక్రమము నందు పాల్గొనిరి.

2. 11.2.92 తేది మొదలుకొని 13.2.92 తేది వరకు షోలాపూర్ నందు శ్రీ స్వాములవారిచే గీతోపన్యాసములు నిర్వహింపబడెను.

3. హైదరాబాదులోని దిల్‌సుఖ్‌నగర్‌లో "స్వామి విద్యాప్రకాశానంద సత్సంగ ప్రథమ వార్షికోత్సవము"నందు 19.2.92 తేది యందు శ్రీ స్వాములవారు పాల్గొనిరి. శ్రీ బి. శ్రవణ్‌కుమార్ గారు ఈ కార్యక్రమము విజయవంతమగుటకు తోడ్పడిరి.

4. శ్రీ కాళహస్తి యందలి శ్రీ శుకబ్రహ్మాశ్రమము నందు త్రినేత్ర వైద్యాలయము (భక్తకన్నప్ప కంటి ఆస్పత్రి) యొక్క భవన నిర్మాణము చురుకుగా సాగుతున్నది.

5. అనపర్తి (తూర్పు గోదావరి జిల్లా)లో 1992 మార్చి 18, 19, 20 తేదీలందు జరుగబోవు శ్రీ సనాతన వేదాంత జ్ఞాన సభకు శ్రీ స్వాములవారు అధ్యక్షత వహించెదరు.

6. ఆశ్రమ వార్షికోత్సవము, వైద్యాలయ ప్రారంభోత్సవము రెండును ఒకేసారి చేయుటకు నిశ్చయింపబడినది. తేదీలు తరువాత తెలుపబడగలవు. ○○

## నిధి సేకరణ

దేహోపల మపాకృత్య
బుద్ధి కుద్దాలకాత్పునః
ఖాత్వా మనోభువంభూయో
గృహ్ణీయాన్మాం నిధిం పుమాన్

బుద్ధియను పారచే దేహమను రాతిని పెళ్ళగించి, మనస్సను భూమిని త్రవ్వి ఆత్మయను నిధిని గైకొనవలెను.

*(దేహాభిమానమును వదలి వివేకయుక్తమగు బుద్ధిచే తత్త్వవిచారణ లెస్సగ సలిపి, మనస్సున కాధారభూతమైన ఆత్మస్వరూపమును సాక్షాత్కరించుకొనవలెను.)*

Printed and Published by **Vemuri Balaram** for Sri Sukabrahma Ashram, Sri Kalahasti Printed at Swati Press Anil Estates Vijayawada
**Editor : B. ESWAR**

# నారద భక్తి సూత్రములు–74

## వాదో నావలమ్బ్యః

*తా।* భక్తులగువారు వాదవివాదములు చేయరాదు. వానిలో పాల్గొనరాదు.

వ్యాఖ్య :– భక్తులు పరమార్థ విషయములందుగాని, వ్యావహారిక విషయములందుగాని వాదనకు దిగరాదు. వాదోపవాదములుగాని, తర్క వితర్కములు కాని చేయరాదు. వాదములన్నియు మనస్సునకు సంబంధించినవి. భగవంతుడు వాక్కులకు, మనస్సునకు అతీతుడు. కనుక వాదములచే అతడు అగమ్యుడు.

తర్కా ప్రతిష్ఠానాత్.

తర్కము ఆధారము లేనిది–అని బ్రహ్మసూత్రమునందును–

నైషా తర్కేణ మతిరాపనేయా

దైవతత్త్వము తర్కముచే సంప్రాప్తించదు–అని కఠోపనిషత్తునందును తెలుపబడినది. భక్తుడు భగవంతునిపై పరిపూర్ణ విశ్వాసముకలవాడై, ఆతడే తన సర్వస్వము అను దృఢ నిశ్చయముకలవాడై వాదములలో తలదూర్చక, తర్క వితర్కములందు తగుల్కొనక ఉండవలెను. మనస్సును నిరంతరము దైవమందే సంలగ్నమొనర్చి, దైవానుభూతిని బడయుచు పరమానందమనుభవించుచుండవలెను.

ఓం